శ్రీ

# వ్యాస వ్యాసము.

ఇది

విజయరాంపురము ప్రా[illegible]

శ్రీచెలికాని వేంకట సూర్యరావుగారి

ఆశ్రితుఁడు,

కొత్తపల్లి సుందరరామయ్యచే

రచియింపఁబడి

ఏలూరు,

రామమోహన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడియె.

(మొదటికూర్పు 500 ప్రతులు)

వెల 0—1—0.

శ్రీ

# వ్యాసవ్యాసము.

ఇది

విజయరాంపురము ప్రొప్రయిటరు
శ్రీచెలికాని వేంకట సూర్యరావుగారి
ఆశ్రితుఁడు,
క్రొత్తపల్లి సుందరరామయ్యచే
రచియింపఁబడి

ఏలూరు,
రామమోహన ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రచురింపఁబడియె.
(మొదటికూర్పు 500 ప్రతులు)
వెల 0—1—0.

శ్రీ

# వ్యాస వ్యాసము.

ఉ. వ్యాసుఁడు పక్షపాతమున
భారతకల్పితగాధనిట్లుగా
వ్రాసెను గౌరవోత్తముల
వాసిదొలంగఁగఁ జేసియారకుం
తీసుతులన్ మహోజ్జ్వలమ
తిష్ఠిరులం బొనరించియంచు వి
ద్యాసముపేతపండితవ్రా
దబ్జములిట్లుకళంక మొందునే. 1

ఉ. మేదురబుద్ధిశాలియయి
మించిమునుల్ గవులున్నుతింపన
ష్టాదశసత్పురాణముల
జక్కరచించిమహాజనానురా

తాదరమంది వేదమూల
యుందలిచిక్కు నడల్చినట్టివు
గోర్యదయుండౌ మహర్షివయి
నొల్లమినీర్ష్యవహింపం జెల్లునే. 2

౩. ఒక్కరూపకాదయోజింపం బాండవుల్
కౌరవులునుకవికి గౌరవమున
నందుం దాతయైన వ్యాసుండు మనువాల
వేఱుదలంచునంట వెట్టికాదె. 3

౪. ఒక్కరియందుసద్గుణము
నొక్కరియందునదుర్గుణంబుపెం
పెక్కగనుంటబందుగుల
యోనియుంబక్షము లేకవీడకా
మిక్కిలిదుష్టుడంచుబలె
మేటిగొనంబులవొప్పితండటం
బొక్కవిధంబునందలంచి
యొప్పుగం జెప్పుటదోసమెట్లగుర్. 4

ఉ. పంచమవేదమైతనరు
భారతకావ్యము కల్పితంబుగా
నెంచినఁ దత్కథాకథన
మెట్టులసాగుగుణాగుణంబులం
గొంచకఁ దెల్పఁ జేసినది
పాండుకురువీరులటంచునందఱిన్
నెంచిమతింపఁ బ్రాకృతులు
నేర్పడినీతియొకండునుండునే. 5

మ. "అలఘుప్రాభవభానుమానుఁడుమహీ
యైశ్వర్యసంపన్నుఁడు
న్వాలసౌందర్యధురంధరుండఖిలశా
స్త్రజ్ఞానవారాశిని
స్త్రులనల్లక్షణలక్షితుం" దనుచునా
దుర్యోధనుం బెద్దగాఁ
బలుకంజొచ్చినవారలెవ్వరిలనా
వ్యాసుండుగాకుండినన్. 6

గీ. న్యాయమెంచుచు సాత్యవతేయుఁడిట్లు
తెలుపకుండిన మనకెట్లు తెలియనగును
వానిగుణగణమప్పట్ల వ్యాసుఁబక్ష
పాతియననేరికేసియుఁ బాడియగునె. 7

ఆ. కుంతిగుణము లెల్లఁ గొండాడి గాంధారి
గుణముఁ బొగడకున్నఁ గొఱఁత గాని
సుబలతనయభర్తచూపు లేదని తాను
గంతగట్టిననుట ఘనము గాదె. 8

గీ మగఁడు చచ్చినఁ జచ్చుట మానినులకు
పంగుఁడని కాల్విరచుకొంట భామినులకు
నంధుఁడని యంధతంగొంట యతివలకును
దలఁపనివియస్వభావ వృత్తుఁ గుఁగాదె 9

గీ. సదమలచరిత్ర మానినీ జనమతల్లి
సౌబలేయియుధిష్ఠిరు జన్మవార్త
వినియుదరతాడనంబుఁ గావించుకొనిదొ
స్త్రీలకీరసముస్వభావ వృత్తిగాన. 10

గీ. ఎంతమంచితనంబున్న నింతయేని
రాజ్యకాంక్షనసూయతరాజులందుఁ
బుట్టకుండునెయట్టిదుర్బుద్ధిధార్త
రాష్ట్రులకుఁగల్గెఁగావునవ్యాసెనుఁగవి. 11

ఉ. పాండవ పక్షపాతమున
వారికియుక్తములైననామముల్
మెండుగ వెట్టి కౌరవుల
క్లిష్టసమాఖ్యలఁ జేసెనంచునె
న్నండునుబల్కు రాదుకురు
నాథసుతుండు సుయోధనుండునా
నుండఁడె రాజరాజనఁగ
నుండఁడెయియ్యవిదుస్సమాఖ్యలే. 12

క. ధృతరాష్ట్రుండెమ్మెయిఁ దన
సుతులకుఁ జెడుపేరులిడఁగఁ జూడఁడొ? పాండు
క్షితినాథుండట్టులె తన
సుతులకు ఘననామములిడఁ జూడఁడుగాదే!

గీ. చేయుచేష్టలఁబట్టివచ్చినయభిఖ్య
మంచిదియుఁ జెడ్డదియునంచు నెంచనేల
శిష్టములొనర్చి పాండవుల్ శిష్టులైరి
దుష్టములొనర్చి కౌరవుల్ దుష్టులైరి. 14

ఉ. పాటిగధార్తరాష్ట్రులును
పాండుసుతుల్ దమ శైశవంబు నం
దాటలనాఁడు వేళల బ
లాబలముల్ దగవ్యక్తమైనన
ప్పాటవిరోధవృత్తిని ప్ర
భంజనపుత్త్రునిమీఁద మోపఁగా
నేటికి బాదరాయణు న
హింపమివ్యాగత సేయనేర్తురా. 15

క. ఫలవృతంబులకన్నన
బలురా కౌరవులుచెట్లపై నెక్కమికా
బలనందనుండుమ్రాఁకం
బలిమిమెయిఁగదల్పవడిన నవ్వుటలొప్పె. 16

క. తనసుతులెల్లతమ్ముపెద
తండ్రిగమంగొనుచుండఁ బాండునం
దనులును తండ్రివోలెగురు
తంజరియించిరి ధార్తరాష్ట్రులి
చ్చనుబినతండ్రి పుత్త్రులని
దక్కఁగఁజూడమినన్యభావమున్
గొనిచరియింపఁగావలసె
కూళలచైదము సాధులోర్తురే. 17
ఉ. బలవంతుండగుభీముఁజంపినమహా
భాగ్యంబులందామెయి
మ్ములసౌఖ్యమ్ములఁజెందువారమనిధీ
ముందాళ్ళచేఁగట్టిని
ళులఁద్రోయంగవిషాన్నముల్గుడుపఁజె
ల్లుంబోలుదత్కృత్యముల్
గలకాలంబుమదిందలంచికినియం
గారాదవిరోతముల్. 18

గీ. తనకుమారులఁదమ్మునితనయులనొక
పోల్కఁగనునాంబికేయుండుపుత్త్రులవిడఁ
బాండవులుఁచచ్చిననునెల్లబంధువులును
మడసిననటంచుఁబల్కుటమంచియగునె. 19

గీ. అత్మవత్సర్వభూతానియనునుడువును
బాటిసేయనిధృతరాష్ట్రుపట్లనింత
కన్ననెక్కుడు నేరంబుగావలయునె
పాదరాయణుఁడొకఁడెకన్పట్టుఁదెగడ. 20

గీ. ఆంబికేయునియెడఁదనయాత్మజులను
పేఁడననుటొండెకానియేవిధమునఁగన
నన్యదోషంబుగలదేయటంచుఁబల్క
సాహసముగాదెనేరముల్పాలఁగలుగ. . 21

గీ. లక్కయింటనుబాండవులనుదహింపఁ
గడగినప్పుడుప్రోత్సాహమిడుటకౌర
వేశ్వరునితప్పుగాదొయాహీనవృత్తి
తోఁచెఁబోలునహీనమై తుచ్ఛమనక. 22

ఉ. కౌరవపాండవులవ్యసన
కారణమైనదురోదరంబునం
జేరుచున్న వేళనిది
చెట్టయటంచు వచింపఁ బోక మీ
కోరినయట్లు సేయుఁడని
కూరిమిఁబుత్త్రులఁ దోలెగాని యా
కౌరవనాథునాత్మజునిఁ
గాదని పల్కెనె? దుష్టబుద్ధియై. 23

గీ. ఆగతానాగతంబులనరసినంద
నందనుండాంబికేయునిఁబొంకుపఱుప
రాయబారంబుపలుకంగ రాజరాజు
మాటలాలించికృష్ణునిమాటవినెనె? 24

గీ. పాండవులయెడనెక్కుడు పౌరులకును
గౌరవంబుండెననిదానిఁ గాంచలేక
సుతులువారలవెలిసేయఁ జూచుచుండఁ
దానునంగీకరించుట ధర్మమౌనొ... 25

గీ. తనసుతునివోలెఁగనఁదగుననుజుఁగొమరుఁ
డైనయాసవ్యసాచి దివ్యాస్త్రములను
బొందెనని విని యోర్వమిఁగందికుంది
యీర్ష్యవెల్లడిసేయుట యేటితగవు. 26

మ. అవురా! ధర్మపథానువర్తులయిరా
జ్యంబంతయు న్వీడిదై వ
తవనంబందున జేరి మిక్కిలివిషా
దవ్వాంతులై యున్న పాం
డవులం జేరఁగఁ బోవు కౌరవ్యులతో
డంగూడి యిస్సీ! యగౌ
రవమున్సేయఁగ సమ్మతించుట మహా
రాజోచితంబే కర్ణా. 27

మ. తనమూలంబున సర్వబంధువులుఁ బు
త్త్రపౌత్రమున్మిత్రసై
న్యనికాయంబును జచ్చి స్వర్గమును డా
యంబోవనపి నబాం

దున్నపాలాంత్మజుండదుఁ బ్రేమయొకనా
డున్నేకయా వాయునం
దనునింగాఁగౌఁటఁబట్టి చంపుటకుఁజి
త్తంబెట్లు రాఁజెల్లెనో! 28

చ. తనసుతవర్గముఁ దనదు
తమ్మునిపుత్త్రులు భేదబుద్ధిగ
కొనిరనియిర్వురన్నృభము
గోరెడునంధమహీశ్వరుండు చె
ష్టనడతకూడదంచునక
టాసరిసేయకపుత్త్రపక్షముం
గొనితనతమ్ముపుత్త్రులను
గూళులుగాఁదలపోయుటొప్పునే. 29

మ. అయయో భర్తదివంబు జేరెననియా
హాదైవమాయంచుఁగుం
తియుఁగట్టా తలిదండ్రులీక్రియమృతిం
దెక్కొన్నవారంచునా

్రయుతుల్ బాండవులేగుదెంచినను వా
రిం బొండుపొండంచు నెం
తయు దూషింపక మిన్నకుండెనను వా
ర్తల్ గొప్పలే యెంచఁగన్. 30

చ. తనయుల వెంటఁ బెట్టుకొని
తాపసవర్యులతోడఁ గుంతి వా
రణపురిఁ జంతఁ జేగ ధృత
రాష్ట్రుఁడు వారలఁ బొండుపొండటం
చని యెడివాఁడె కాని జన
కాభిమతంబున భీతిఁ జెంది స
జ్జనపథముం గ్రహించెనది
సత్యము గాఁ దలపోయఁ జెల్లునే. 31

గీ. రాష్ట్రమనగనుపద్రవార్ధంబుగలుగఁ
జే యునదియాట చేనాంబికేయునకును
గలిగె ధృతరాష్ట్రనామంబు గాని యొండు
గాదని యెఱుంగఁ గావలెఁ గవిజనంబు. 32

గీ. అరయఁగాధృతమస్పృద్ధి యనెడునార్య
వచనమదిసార్థకంబుగావర్తిలుటనె
వ్యాసుఁడీరీతిన్యాయంబు వ్రాసెఁగాని
మూలమెఱుఁగక చేసిన గోలగాదు. 33

గీ. పాండుదేహంబుగలిగిన పాండురాజుఁ
గుష్ఠరోగిగఁదలపోసి, కూడునొక్క
యిట్టిదుసభాస్థుఁడై రాజ్యమేల? నకట
గ్రుడ్డివాఁడుర్వరను నేలఁగూడదొక్క! 34

క. అనినేరస్థునిఁగా వ్యా
సునినింధించుట యెకాని సూక్ష్మపుదృష్టిం
గనఁదెలియదె యిరువురిలో
ఘనరాజ్యంబెవ్వరేలఁగాఁగలవారో. 35

చ. బసవన! పాలుద్రావుదు వె
పలుకుమునాఁదలయూచునట్లుగా
వెసనెవరేమిసెప్పినను
వించుఁజరించెదు నాంబికేయుఁడే

వసుమతి నేలనప్పుడో? ప్ర
పంచముసర్వము దివ్యదృష్టితో
మనలక చూచిప్రోచుజన
మాన్యుఁడు పాండునృపాలుఁడప్పుడో?
గీ. వినియొనర్చుటకన్ను గనియొనర్చ
నదియొఘనము సాత్వతయాంబికేయ
పాండునరపాలురవలనఁ బ్రచురమయ్యె
నిదియు వ్యాసోదితంబుగా నెంతురేమొ. 37
సీ. మాణిక్యమణిమయమండితచంద్రికా
స్వచ్ఛశిరోవేష్ట భాసురులును
నవనవరత్నసన్నద్ధజాంబూనదో
జ్జ్వలసద్భుజాంగద భాసురులును
తరలేంద్రనీలబద్ధసువేల్లితప్రశ
స్తోరుముక్తాహార ధోరణులును
అఖిలవిచిత్రవిన్యాసవుసువర్ణమ
హారాంకవకలావధోరణులును

గీ. కలిగి వెలయుస్వయంవర నిలయమందు
మన్మథోపములై యొప్పు మనుజపతుల
నెల్లవరియింపనొల్లక హీనుఁడుఁగడు
కుష్ఠరోగిఁబాండునృపాలుఁగోరెఁగుంతి. 38
గీ. దీనఁదెలియదె పాండుధాత్రీవిభుబల
రూపసంపద లెంతయు రూఢిబరన
రేంద్రపరిభావియనుజగదేకవీరుఁ
డై నయీతండుతగఁడె రాజ్యంబునేల. 39
సీ. మడిసిరి పాండుకుమారులు లాక్షాగృ
హంబుననని విని యడలుఁ జెందె
వనవాసమున బాండుతనయులు క్లేశంబుఁ
జెందియుండిరటంచుఁ జింతనొందె
కుంతీసుతులతోడఁ గూడియుండుట లెస్స
యనిసుతుసంధి సేయంగఁబలికె
నారాయణుఁడుసంధిఁగోరివచ్చెనటంచు
విదురునితోఁ దెల్పిముదముఁ జెందె

గీ. అనుచు వ్యాసుండు వల్కెనో, యాంబికేయుఁ
డట్టి సుగుణంబులను గల్గి యలరువాఁడొ
తెలియఁగారాదు సత్యవతీకుమారుఁ
డెవరిపక్షంబు గలవాఁడొ యెఱుకపడదు. 40

ఆ. ధార్తరాష్ట్రులన్న దర్పంబు మొయినేగు
మారుతియుఁ గిరీటి మాద్రిసుతులు
అన్న మాటకొక్క యడుగైన దాటక
కట్టువడుట యెంత ఘనమొ కనుఁడు. 41

గీ. ముక్కు మొగమెఱుఁగని యూరిమూఢజనులు
పాండురాజెన్నఁడో చచ్చెఁ బాండవులెట
నుద్భవిల్లిరటంచు నయ్యో! వచించు
పలుకులను నాంబికేయుండు తలఁచెనొక్కొ 42

క. అసిధృతరాష్ట్రునకుం గౌరవ
మునొసంగఁగ నేలపాండు భూమీశుఁడుఁద
త్తనయులు గలరని యునుడ (గదుగా. 43
మ్మునిమ్మృతియు నెఱింగియుంటఁ బోషించెఁ

చ. విదురుఁడుభీష్ముఁడుంబొడిచి
పిలనియింపునయౌవరాజ్యస
త్పదమునఁ బాండవాగ్రజుని
భవ్యగతిన్నిలుపంగఁబల్కఁదా
నదివ్యతిరేకభావమున
నాత్మఁదలంపక యౌవరాజ్యస
ద్పదమునొసంగెనంతియ స్వ
భావమునందనకిష్టమున్న దే! 44

మ. మఱపుం జెందతివారుతమ్ముబలిమిఁ
మారొక్కన్న నద్దానసే
ద్దైఱఁదానుఁ దనపుత్రవర్గమునుభీ
తింబొంద నానంచులో
నొఱలంగత్రుళ్ళఁ సౌలెఁ బాండవులఁదా
నుంచంగ భావించి యే
కొఱలేకుండఁగఁ బాండవాగ్రజునిసౌ
కొల్పేఁ దదీయస్థితిఁ. 45

గీ. పితృపితామహులవలనఁ బ్రీతినేఁ
బడిక్రమాగతమైనట్టి భవ్యరాజ్య
పదవిసగ బాలొసఁగుఁడంచునదియుఁ గాక
యయిదుగ్రామంబులేనియిమ్మనుటయుఁ గన.

గీ. పాండవులు ధైర్యశౌర్యసంపదలఁ బొదలి
యుండియును బల్మిఁ గైకొనకుండుటయది
తప్పిదమె. ధర్మమార్గంబుఁ దప్ప వార
మనివిచారించియట్టులనడిగియుండ్రు. 47

ఉ. మేలని యెల్లరుంబొగడ
మేటిమగండగు పాండురాజుచేఁ
బాలితమైన భూమిసగ
బాలొసఁగుండను పాండుపుత్త్రిలం
గూలికివచ్చి పాలడుగఁ
గోరదరంచు వచించుకన్న మేల్
కూలికిఁ గావిషంబుఁగడుఁ
గ్రోలిరనందగుఁ గౌరవావళిన్. 48

ఉ. అన్యకిరీటరంజితప
దాబ్జుఁడు పాండునృపాలుఁడంచు సా
జన్యము మీఱఁ బల్కుటనె
సర్వవసుంధరకు న్విభుండు రా
జన్యుఁడునై వెలుంగఁగన
జాతవిరోధి యమార్గగామియుం
చన్యముగాఁ దలంచుటది
న్యాయమె? పాండుగంగఁ జెల్లదే!

గీ. ఇప్పుడవిభాజ్యరాజ్యమం చెన్నుకొనిన
నెవ్వరికిఁ జెల్లునో రాజ్యమేలుకొనఁగ
నూఁదిమాపిన యంతటి మేదినియును
గౌరవులకుండు నేన్యాయగతిఁ దలంప. 50

గీ తండ్రి కోర్కెను జెల్లింపఁ దాశరాజు
కూఁతు శంతనునకు బీయఁ గోరి దాన
నర్థియై యుండ నియమంబుఁ బట్టెఁ గాని
తీవ్ర సన్న్యాసి కాఁడు దేవవ్రతుండు. 51

సీ. కాశిరాజుసుతలఁ గైకొనుకలనమం దో
యోధుండు రథియునై యొప్పుమీఱె
పరశురామునితోడ భండన మొనరింప
యోధుండు రథియునై యొప్పుమీఱె
ఉత్తరగోగ్రహణోద్యోగమున మించి
యోధుండు రథియునై యొప్పుమీఱె
కౌరవపాండవ ఘోరయుద్ధంబున
యోధుండు రథియునై యొప్పుమీఱె
గీ. వస్త్రములు నాయుధంబులు వాహనములు
భూషణంబులు మిక్కిలి పూనియుంట
గాక యిసుమంత యేనియుఁ గాంక్ష విడని
భీష్ము సన్యాసియంట యెవ్విధమునఁ దగు 52
క. సన్నిధిఁ జేరినయంబను
గన్నె తపంబెసఁగలె భీష్ముకడ నుండుటనం
చున్నింద్రించున సాల్వుఁడు
సన్యాసియొ భీష్ముఁడైనఁ జనుచనుమంచుర్.

గీ. న్యాయమెచ్చటనుండు జయంబునచ్చట
నుండునుజయంబె చటనుండు నుండునచట
గృష్ణుఁడని సంజయుండాంబికేయునెదుట
నుడివెసామాన్యజనముల నుడులుగావు. 54

సీ. సేననక్షౌహిణిఁ జెండాడిపిమ్మట
శరతల్పగతుఁడగు శాంతనవుఁడు
అఖిలవీరులఁ జంపి యాత్మజుపైఁ జింత
నస్త్రసన్యాసియౌ నస్త్రగురుఁడు
ఇరుదెసలహితంబు నెరపిపాండవసేన
మడియఁగఁ జేసిన మద్రపతియుఁ
గడుబల్లిదుఁ ఘటోత్కచముఖ్యులను నాజిఁ
గూల్చఁగఁ జేసినయట్టి యంగరాజు

గీ. అరయఁగంత గతప్రాణులగుదురు ను
యుద్ధమును సేయలేమహాయోధులగుచు
వీరకదముఖ్యులయినట్టి వీరవరులు
పాండవులశత్రువులని పలుకఁదగునె 55

కవచకుండలములు లేనికతనఁబరశు
రాముఁడబలుండనుటనాజిరథముగుఱ్ఱంగు
ననిద్విజుఁడుశాపమిచ్చుటనంగభర్త
నర్ధరథుఁగగంగాసుతుండాడఁదప్పె! 56
పాండవులయెడఁగౌరవపక్షమునను
జూడనమదృష్టి కలిగినవాఁడవునెడ
బ్రతికియున్నంతకాలముబహువిధములఁ
గౌరవులఁగూడునెట్లుగంగాసుతుండు 57
సంజయుఁడుభీష్ముచావుఁజె
వింజొనివినయంతనంధపృథ్వీశుఁడు
నెంజలిసుతుఁనునిందిం
చెంజచ్చిననేమిపరులఁజేసుటనవినే? 58
బాలకుండభిమన్యు బాణంబులసగంబు
చచ్చియుండండెడుశ్వాసనుండు
చేయఁగూడనిపనిఁజేసిపాండవదసుఁ
డై సిగ్గువడడెజయద్రథుండు

పరబలంబులఁ గాంచి భయముచేతఁ బిఱికి
మందులు వోయఁడే మదవిభుఁడు
భీమసేనుండన్న భీతి ద్వైపాయన
హ్రదమున డాఁగఁడే రాజరాజు

గీ. పందలిందఱు భారతమందుఁ గల్గ
బాలుఁడును బల్లిదుఁడు ధైర్యశాలియైన
యుత్తరుండే యనఁగ నెట్టు లొప్పు నేరు
పరబలం బధికంబైనఁ బాఱకుండ్రు? 59

మ. పరగండోద్భటుఁ డుద్ధరంగమునని
ల్వంగా సమస్త్రౌఘముల్
గురిగాఁ జేసినభంగి విల్లుఁ దగనె
క్కుం బెట్టి బాణంబుల౯
నరుఁ డేయం దెగవిచ్చె సైంధవుని ప్రా
ణంబుల్గొనంగా నన౯
గురుమర్యాద లెఱుంగకుండిరని పె
క్కుల్చెప్పఁగా నేటికి౯. 60

గీ. పాండవుల చేతఁ జిక్కిన పట్ల వారి
విడిచి యంగేశుఁ డన్యాయవృత్తి నుండ
శల్యుఁ దొనరించెఁ గడు నిరుత్సాహునిఁ గన
టంచుఁ బల్కంగ నందర్భముగు నెతలఁప. 61

సీ. అభిమన్యువిక్రమం బమర వధించిరే
విరథుఁడై విలు లేని వేళఁ గాని
చంపిరే బలిమి ధృష్టద్యుమ్ను నిశధను
ర్గుణమునఁ గుత్తుకఁ గోసి గాని
కడ తేర్చినారె యఖర్వదోశ్శక్తిఁ ద
ళుక వవాదిదివ్యాస్త్రకోటిఁ గాని
సమయించిరే శత్రుసైన్యంబుల న్యాయ
వర్తనంబున జిత్తుఁ బన్ని గాని

గీ. కపటకార్పణ్యము ననది కౌరవులకె
చెల్లుఁ బాండవులకొకింత చెల్లఁబోదు
దైవబలమంగబలము శస్త్రములబలము
గలిగియుంట నన్యాయమార్గమున జరిగె. 62

ఉ. డాయఁగనాసుయోధనుతో
దలగదవాయుజుఁడేయనెంతయున్
న్యాయముగాదటన్న వచ
నంబులనమ్మగరాదుమున్నుగాం
తేయులుజూడద్రౌపదికిఁ
దెచ్చినయాయవమానవేళఁగో
పాయతశౌర్యుఁడైనయని
లాత్మజుఁడూనుప్రతిజ్ఞయాటచేన్. 63

గీ. ఇంతియేగాక మైత్రేయుఁడిచ్చియున్న
శాపమూరాజరాజునుజంపకున్నె
పాడవెగసిమీఁదికుఱుకునప్పుడటుసేయఁ
జెల్లునని వానుదేవుండుసెప్పలేదె. 64

గీ. ఔర ! గోరంత లేక కొండంతయయ్యెఁ
గౌరవులగౌరవంబేమికారణంబొ !
యబ్బ గోరంత లేక కొండంతయగుచుఁ
బాండవాగౌరవంబును బ్రచురమయ్యె. 65

ఉ. "వ్రాయఁగవచ్చు వ్యాసముని
వర్యుఁడువ్రాసినయట్టిభారతా
మ్నాయములోనియంశములు
మారిచిమారిచి వేఱెభారతా
మ్నాయముధార్తరాష్ట్రులది
న్యాయమటం" చననేలయల్లరా
మాయణమేలవ్రాయఁదగ
దట్టులమారిచిమార్చిచక్కఁగన్. 66

గీ. రావణునిదుర్గుణంబులురామునకిడి
రామునద్గుణగణములరావణునకు
నిడక వాల్మీకినిందలఁ బడెడుఁబోలు
నిప్పుడతఁడున్నమార్చి వ్రాయింపఁదగును.

క. దశకంఠుండేమిడఁడో
దశరథసుతుఁడేమియిడెనొ తనకావాల్మీ
కిశుభంబు రామునకునిడి
యశుభంబులనుంచె రావణాసురుఁగనుఁడీ.

గీ. తెలివిగలవార లెంతయుఁ దలఁచుకొనవ
ధర్మపరులను మిక్కిలి ధర్మపరుల
ధర్మపరులను మిగుల నధర్మపరులఁ
జేయవచ్చుఁ బురాణముల్ జెప్పె వేగ. 69

---

# సారాంశము.

గీ. కౌరవశతంబుఁ గూల్చిన కారణంబు
పాండవులు కష్టశతములఁ బడి ధరాత
లంబు సకలంబు వేలఁ దలంచి కాదు
ధర్మపథమును వర్తింపఁ దలఁచి కాని. 70

ఆ. మానవలదు ధర్మమార్గసంచారంబు
టెంచుఁ బ్రతిభ విడన నర్థమంచు
రాజ్యకాంక్షనుండ రాదంచు ఋషులతో
నుడువుమంచు హరికి నుడివెఁ గుంతి. 71

సీ. కందమూలముల నాకలిపుచ్చిఘోర మృ
గాకీర్ణవనముల నలయనేల?
అన్న మోరామచంద్రా యంచు నేకచ
క్రపురంబునం ద్రిమ్మరంగ నేల?
కడుహీనవృత్తినీగతికిఁ దెచ్చితె మమ్ము
లనటంచు విరటుఁ గొల్వంగ నేల?
బల్లిదులయ్యు దుర్బలులట్లు బరభుక్త
యమునకో వకే చింతనంద నేల?
గీ. ప్రతిన నెరవేర్చుకొనుట యేపరమధర్మ
మనితలఁచి కార్యవాదులైననుగడంగి
పాండవులఁ గౌరవులు ఖడ్గవాదమునకు
దింపిరే కానియొండుతలంపు లేదు. 72
చ. సుతశతముఁ గతించెనను
చున్వగఁ గూరిన సౌబలేయి వా
యుతనయుఁ డా సుయోధనుని
యూరువుఁ జించుటలెన్నయంచున

స్మృతిఁ బొగడంగ లేదె జన
మాన్యులు పాండవులంచు వారిదు
ర్మతులయిరంచుఁ బుత్త్రులఁ గ
రంబుఁ దలంచుచుఁ దిట్టిపోయదే. 73

గీ. బంధువులనెల్ల వధియింపవలెనటంచు
సర్వసామ్రాజ్యమేలఁ గాఁ జనునటంచుఁ
బాండవులయుల్లములలోలవంబు లేద
టంచు బాలకుఁడైన వచించుఁ గాదె! 74

ఉ. అమ్మరో! యింత కాలము
యంగవిభుండు మదగ్రజుండటం
చెమ్మొయి దెల్పకుండ నిటు
లేటికి డాచితి మున్నె తెల్ప రా
జ్యమ్మున కాశఁ జెందుదుమె
యందఱబాదుగులన్వధింపయు
ద్ధమ్మొనరింతుమే వెలుచఁ
దాఁకి చలంబునఁ గష్టఁ ద్రుంతుమే. 75

సీ. కందమూలముల నాకలిపుచ్చి ఘోర మృ
గాకీర్ణవనముల నలయనేల?
అన్నమో రామచంద్రా యంచు నేకచ
క్రపురంబునం ద్రిమ్మరంగనేల?
కడుహీనవృత్తినిగతికిఁ దెచ్చితె మమ్ము
లనటంచు విరటుగొల్వంగనేల?
బల్లిదులయ్యు దుర్బలులట్లు బరధుతు
యమునకోపక చింతనందనేల?
గీ. ప్రతిన నెరవేర్చుకొనుట యే పరమధర్మ
మని తలఁచి కార్యవాదులై నను గడంగి
పాండవులఁ గౌరవులు ఖడ్గవాదమునకు
దింపిరే కానియొండు తలంపు లేదు.
చ. సుతశతముఁ గతించెనను
చున్వగ గూరిన సౌబలేయి వా
యుతనయుఁడాను దుర్యోధనుని
గూడ వధించుట లెన్నయుంచు స

మ్మతిఁ బొగడంగ లేదె జన
మాన్యులు పాండవులంచు వారిదు
ర్మతులయి రంచుఁ బుత్త్రులఁగ
రంబుఁ దలంచుచుఁ దిట్టిపోయదే.

గీ. బంధువుల నెల్ల వధియింపవలెనటంచు
సర్వసామ్రాజ్యమేలఁ గాఁ జనునటంచుఁ
బాండవులయుల్లములలోలవంబు లేద
టంచు బాలకుఁడై నవచించుఁ గాదె! 74

ఉ. అమ్మరో! యింత కాలము
యంగవిభుండు మదగ్రజుండటం
చెమ్మెయి దెల్పకుండనిటు
లేటికి డాఁచితి మున్నె తెల్పరా
జ్యమ్మునకాశఁ జెందుదుమె
యందఱు బాంధవులన్వధింపయు
ద్ధమ్మొనరింతుమే పెలుచఁ
దాఁకి చలంబునఁ గష్టఁ ద్రెంతుమే. 75

గీ. అనుచుఁ గర్ణునికై చింతనందెఁ గాని
సర్వసామ్రాజ్యలక్ష్మీవశంబగుటను
క్షేమమని యెంచె నేయుధిష్ఠిరుఁడు దాని
నట్టులుం జూఁడుమఱియొకయరిదిగలదు. 76

గీ. ఏచికడుఁ దోఁకఁ ద్రొక్కిన లేచు త్రాచు
రీతినుండెడు భీముండునీతివిడక
యన్నదమ్ములమైయుండియకటయిట్లు
పోరఁదగదనిపల్కెఁ జేశౌరి హ్రాల. 77

క. కల్పితగాథలవ్రాసియు
నల్పప్రఖ్యాతినందనా వ్యాసునసం
కల్పంబేనిఁ బురాణం
బుల్పొల్పుగ రచన సేయఁ బూనునె యెప్డుఁ. 78

గీ. పూర్ణలోకోపకారసద్బుద్ధిదక్కఁ
బొగడికలఁ గాంచ నెబ్బుడుబుద్ధిలేదు
కానఁ బాండిత్యమును బాఱుగతికిఁ బోక
చిరతరాగాధగాథలఁ జేర్చిచూపె. 79

గీ. జ్ఞానియంచును గానియజ్ఞానియంచుఁ
గానినుతిసేయనిందింపగడఁగఁగఁగొఱ
గానినాకెట్లుసెల్లునాఘమునివ్రాఁత
కానిని,మహర్షి, వ్యాసునిఁ, గడునుతింతు.80

" వ్యాసోనారాయణోహరిః. "

సంపూర్ణము.

---

గీ. అనుచుఁ గర్ణునికై చింతనంబెఁ గాని
సర్వసామ్రాజ్యలక్ష్మీవశంబగుటను
క్షేమమని యెంచెనే యుధిష్ఠిరుఁడు కాని
నట్టులుండుఁడు మఱియొక యరిది గలదు. 76

గీ. ఏచికదుఁడోకఁదోర్క్కన లేచు త్రాచు
రీతినుండెడుభీముండు నీతివిడక
యన్నదమ్ములమైయుండియకటయిట్లు
పోరఁదగదని పల్కఁడే శౌరి హాత్రిల. 77

క. కల్పితగాథల వ్రాసియు
నల్పప్రఖ్యాతిఁ జెందినా వ్యాసుఁగసం
కల్పం జేసెఁ బురాణం
బుల్లోపల్పగ రచన సేయఁ బూనునె యొప్పుగ. 78

గీ. పూర్ణలోకోపకారసద్బుద్ధిదక్కఁ
బాగడికలఁ గాంచనుద్బుద్ధి కేదు
కానఁ బాండిత్యమును జూపుఁగలికిఁ బోక
చిరతరాగాధ గాథలఁ జేర్చి చూపె. 79

గీ. జ్ఞానియంచును గాని యజ్ఞానియంచుఁ
గాని నుతిసేయ నిందింపగడఁగఁగఁగొఱ
గాని నాకెట్లు సెల్లు నాఘుని వాఁత
కానిని, మహర్షి, వ్యాసునిఁ, గడు నుతింతు. 80

" వ్యాసోనారాయణోహరిః. "

సంపూర్ణము.

---

# తప్పొప్పుల పట్టి.



| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 5 | 2 | గూయత | గూయయా |
| 13 | 9 | నేరస్థు | యాగస్వి |



| | |
|---|---|
| 29 స్పోర్టు (వేటవిషయము) | 0-1-6 |
| 30 రాణీసంయుక్త. | 0-8-0 |
| 31 తారకామనస్క రాజయోగము. | 0-6-0 |
| 32 వేంకటేశ్వరశతకము. | 0-3-0 |
| 33 లుబ్ధాగ్రేసరచక్రవర్తి ప్రహసనము. | 0-1-0 |
| 34 ధూమశకట ప్రహసనము. | 0-1-0 |
| 35 సావిత్రీకథాసంగ్రహము. | 0-2-0 |

మ. రా— 0-1-0 లకు తక్కువ వీ. పీ. పంపఁ బడదు. అట్లు తక్కువ పుస్తకములు కావలసిన వారు పోస్టు బిళ్ళలు (లేబిల్సు) పంపినచో కోరిన పుస్తకములు పంపఁ బడును.

కలయువారు:—

మేనేజరు కవినాథవిలాసము,

ఏలూరు, కృష్ణా జిల్లా,

అని [illegible].

